20. నాదనామక్రియ—ఆదితాళం

ప॥ రండిచూడగా । శ్రీరాములోరికళ్యాణమంట 'రం॥

అ॥ దండిగాను నపున్న రాసులు పెద । కొండలవలెభోజ సంతర్పణము మెండుగాను జేతురంట రాముల పండుగంట యింకేటోనంట 'రండి॥

2. రాములోరుపుట్టినదినమదియట । కామితంబులెల్లనిచ్చువాడట యేమిడబ్బులేనివారుకూడా । స్వామినిగనుగొనవచ్చునంట 'రండి॥

3. సంసారముభోనుచుభయముచే । జారబోకుడెనకకు ప్రభువులార కంసారినినమ్మి భద్రగిరిలో । గలుగుసంబరము లెంతోవింత ।రండి॥

4. ధరనుతరత్నువుబాపిరాజున । ద్వరదునేలురాములోరువింతగ తిరుగునంటవీధులందురథమున । తెల్లవార్లుసంబరములంట ।రండి॥

మరండిమరండీ నేను చెప్పదలంచింది మీారువిననెంచింది యేందంటే మాభద్రాద్రిలో రాములోరికి సీతమ్మకి పెళ్ళిసేత్తారంట. బాగా సంబరాలు ఒద్దేభోజనాలు పెడతారు. అందరు పిల్లామేకా బయలుదేరి రండీపోయి (డప్పువాయించును.)

గ్రామ=మీాగ్రామంలో కళ్యాణం ఎప్పుడురా

పోల=బాబు రే పాదివారం నాడండి. దయచెయ్యండి బాబు (శలం)

గ్రామ=మంచిది.

21. కళ్యాణిరాగం—అడుగుకీర్తన—ఆదితాళం.

ప॥ మిత్రులారావింటిరే । చాటినదెల్లా ।మిత్రులారావింటిరే॥

అ॥ మిత్రులారరామ । మేదినీసునకుయీరాత్రియున్నకమంట। రండిపోదాము వేగ ।మి॥

2. సంతర్పణములంట యున్నవమూలు । చాంచేసెదరంట గంతులువేయుచు। కరతాళములతోడ సంతతముభజనాలు జరుపుచుండుదురంట ।మి॥

3. దూరామనిదలచాకుడీ । భద్రాద్రికి దారీచక్కనిదండి రండిధరనుదొడ్డికుంట । పురమునగలయట్టి పరమాత్మరాము ను । బాపిరాట్కివివరదుకు ।మి॥

జనులు=మిత్రులారాఇట్లయిన ముఖ్యముగాబయలుదేరి పోదము శ్రీమద్రమారమణ గోవిందోహరి.

సుబ్బాపధాని=ఒరే అంటరానివాడా ఏమిటాచాటింపు.

పోల=బాబు ఏందంటారు (దగ్గరకు వెళ్లును.)

సుబ్బా=ఓరేవెధవా మీదికిరాకురా (దూరముగాబోను)

పోల=ఏందయ్యా అంతాచారాలు యిప్పుడేమి ఆచారాలయ్యా ఆచారాలన్నీ అడుగంటినాయి. యింకానీకు తెల్లేదు.

సుబ్బా=ఏమిరా తెలిసేది చెపుతావు

పోల=ఏందయ్యో తిట్టమోతావు. అడుగు తిన్నగాచెపుతా.

సుబ్బ=ఏది చెప్పు తొందరగా.

పోల=దారాలుబొడ్డులోపెట్టి డిపోలోకూకుంటే నువ్వు నేను వకటే బొట్టుతుడుసుకుని బొరుస్టాటలోకూకుంటే యిప్రిడెవ

డో యిూడ్రెవడో తెలియదుగందా. మేము కుట్టినసాప్పజోళ్లు తొడుగుకుని బోజనంసేత్తుంటే తప్పలేదుగాని అంటుకుంటే తప్పా పూటకూళ్ళకన్నా మేమంత తప్పాబాబూ పచ్చడి రుబ్బోడు పల్లోడైతే నీళ్ళమోసేవాడు గొల్లోడు యిళ్ళుతుడిసే వాడు మావ్రోడే వండించేవ్రోడు వ్రోడ్రోము తినేవ్రోడు మాత్రం మీవ్రోడు.

సుబ్బా=చాలు యీంపాటికి చాలించు.

పోల=మాదొరలుచూడు పెత్తందారుడైతే పెదపెళ్ళాము ఉండితీరావు. చెట్టుకాఫీ పుచ్చుకుతీరాల.

సుబ్బా=చాలు దానికేమిగాని ఆచాటింపేమిటి.

పోల=రాములోరు సంతర్పణ బోజనాలు రేపాదారం.

సుబ్బా=బాగాచేస్తారా.

పోల=ఓ. మీాచిత్తానకంటూ యెక్కువే. నేపోతానుబాబూ (పోవును.)

సుబ్బా=మంచిది.

22. సావేరిరాగం—ఆదితాళం

ప॥ వస్తారా వెంకటశాస్త్రిగారు సంతర్పణంబులంట

అ॥ విస్తారమైనపిండివంటలు । ముస్తాబుకొరకు ళాలువాలుదొరకును జాస్తిగాను బొబ్బట్లుపూరీలు । చక్రపొంగలరిశలు బూరెలు ।వ॥

2. క్రొత్తతహాస్సీల్ దారుబహూ । గొప్పగాను జేయుచున్నా

రంటు చిత్తమొదవినట్లుభోజనంబిడి। శ్రద్ధగానుతాంబూల మొసగు ।వ॥

3. పండితుండనధికముగావలెనని । పట్టుబట్టి సంపాదించవచ్చు నండియిట్టువడుపుమనకు రాదువినండి । లెండిరామాలస్యమేల ।వ॥

4. తరముగానిజనముతోవ్రుచుంటిరి । ధరనుశాపిరాజవరదుడగు కదు పరమపావనుండురామచంద్రుని । పాడియాటలాడుచు పోదము ।వ॥

వెంక=అయోధ్యా ముఖ్యముగా వెడదామండి పదండి శ్రీమద్రామారమణ గోవిందోహరి.

దేవేం=నారదమునిచంద్ర పిమ్మటయేమైనది.

నార=ఇంద్రా తరువాత సమస్తము సిద్ధము జేసి మహాప్రళయమగు సంతర్పణలు కళ్యాణము జేసిరి యెట్లన.

23. కళ్యాణి—ఆదితాళం

ప॥ రామునికళ్యాణము । వినిపింతుమన శ్రీరామునికళ్యాణము

అ॥ ప్రేమమీరభక్తవరులుగాచిన । ప్రియకౌసల్యాతనయుడైనశ్రీ ।రా॥

మ॥ వింతలైన చల్వపందిళ్ళలో । వేడుకలరుచిత్రకారుశ్రేష్టులు చెంతనిలచిసకలదేశజనములు । శ్రీగోవిందాయని స్మరించు శ్రీ ।రా॥

2. ప్రమిలగౌతమిస్నానంబులుకడు । ప్రేమమీరనుపవాసంబులుమే లవిరళమగుభక్తికోటిగొలువగ । నానందము వెం

పారగనిత్యము కవిగాయకవిద్వజ్జనన్రుత్యా ।కరగాంతలు గీతములుబాడగా భువితూరర్యాములుగర్జింపగ । పుణ్యానతులునివ్వాళువివ్వశ్రీ ।రా॥

3. విపినవాసులతులితమగుఫలముల । వేడుకలరశ్రీరాములకొసగుచు తపనకులనుభూషణాదయామయ । తండ్రీమముగావుమనుచువేడిన కృపవహించివారికోర్కెల్లను । కొనసాగగజేయునట్టిశౌరికి నిపులమైనమనసారనివేదన । వేడుకలరజేయునిత్యమునుశ్రీ ।రా॥

4. ఘనమగుసంతర్పణలొనరింపుచు । కయింకర్యము జేయుచు రాఘవులకు వినయమొప్పనూష్ణగుండసలిలము । వేడుకతో స్నానమాచరింపుచు ఘనతరంపుపర్ణశాలకరుగుచు ।కమల జాక్షీమసలుతాపుగాంచుచు అనయముశ్రీరామజపానందము । నలరుజనులు బాపిరాడ్వరదుడగుం ।రా॥

దేవేంద్రా అట్టియడమా చడ్డవిపరీతమైనది.

**దేవే=ఏమావిపరీతము.**

నార=రామదాసుగారు అందరకు భోజనము లొడ్డింపుచున్న సమయమున తనకుమారుడు రఘురాముడు నేలనూతిలో బడెనని పిల్లలు తల్లితో దెల్పిరి.

దేవేం=ఎట్లు

నార=యిట్లు

బాలురు=అమ్మా

24. నాదనామక్రియ—చతురగ్రజాతి

ప॥ ఏమిదెల్పుదు మయమ్మాశ్రీకమలాంబనీకు ॥ఏమి॥
స్వామియాజ్ఞయైనదికాబోలునుసుకుమారి కుమారునిగతినీ
'వే॥

కమల=ఏమినాయనలారా.

ప॥ వింతదోచెగామీమాటలు చింతించిజూడ ।విం॥
స్వాంతమందు సందియమగుచున్నది నుంతయైన వెనుకదీక
దెలుపు ।విం॥
స్వాంతమందు సందియమగుచున్నది నుంతయైన వెనుకదీక
దెలుపు ।వి॥

బాలురు=తల్లీ

ప॥ పూలుగోయుచుండ పుణ్యాత్ముడుమీరఘురాముడు ।పూ॥
వీలుగాని పెరటిలోనగలతయా నేలనూతికడకేగెనమ్మ । ఏ॥

కమల=నాయనలారా

ప॥ భంగామేమిలేక భద్రామైయున్నాడసుతుడు ।భం॥
బంగారపునాముద్దులయ్యకే బాములులేకుండెనాతండి? ।వి

బాలురు=ఏమిజెప్పమమ్మా

ప॥ కాలుజారినీట కూలినాడుతల్లిసుతుడు ।కా॥
గోలబెట్టిపైకిదీసిచూడగ వీలులేనివిధముదోచెనీ ।కే॥

కమల=నాయనలారా నాముద్దులయ్యను జూపుడు.

బాలు=అమ్మా యిదిగో యిక్కడే [చూపును]

కమల—[చూరిచి ఏడ్చుచు] హాతనయా నీకు నూరేండ్లు నిండెనా
[తీసుకువచ్చి నాధునకుజూపి] నాథా

26. ముఖారిరాగం—చతురశ్రగతి

ప॥ ఎంతటిపాపపు కాలమువచ్చెను । ఏమిశేతునకటా రఘు రాముడు

అ॥ గొంతుకగోసియు పోయినాడు యీ । గోడుయెటులగడపు దాననాథా ।ఎం॥

రామచంద్రా

1. నేరమేమి జేశెయెరుగడు నేరడు।నీతిధర్మమెపుడువిడువనొల్లడు కారణంబులేని పనికిబోవడు । కాలమృత్యువెటులగూర్చి నాడవు

...నీరజాత నీపదంబు లేమది । నెలమినమ్మిగొలుచునట్టినతిను కుమారుకుమారుడు రఘురామునియిటు మాకెడపితివిక । మనలేముతండ్రి ।ఎం॥

2. నవమాసంబులుమోసికంటినా । నాయన యేమని యేడ్చినా డవ్రా యెవరుదిక్కుమాకుతండ్రి మాయడి । యాసలెటు లదీరునోకుమారక

...ప్రవిమలాంగమైననీదురూపము । బాపినమున్నదుఃజలధి ముంచియు దివికిజేరినాడవాతనూభవ । దిక్కులేడెబాపిరా జవరదుడు ।ఎం॥

నాయనా

ఉ॥ ఏవిధితాళుదాన భువి । నెట్టుల జీవముబుచ్చుదాన నిం
కేవిధిదుఃఖసాగరము । నీదెడుదానసునాథ కండ్లతో
నేవిధిజూతునానుతుక । శేబరమెవ్వరుదిక్కు రామ నా
కేవిధివచ్చుచావు వ్వాద। యేశ్వర ప్రాణమునిల్వదక్కటా.
రామ=తలోదరీబేల పోవకనూరడిల్లుము ఎట్లుమ్మృతినొందినాడు
కమ=నేలనూతిలోబడి నేనెట్లు జీవించగలదానను నాథా
రామ=కాంతామణి

26. దేవగాంధారి—ఆదితాళం

ప॥ సీతాంశుముఖివిచారమునొందగ । జెల్లునెనీమదినాలోచిం
చుమ ।సీ॥

అ॥ ప్రీతిమెయిన్ సంసారసాగరపు । పీడడవిలివర్తించుటగాదది

మ॥ రాతినాతిజేసినట్టిశ్రీరఘు । రామచంద్రమూర్తిపాదకమ
లము లాతతగతియనినమ్మికొలువుమ । త్యాసవిడచిసాకు
మార్యసీలా ।సీ॥

2. సతులుపతులునుతులుధాన్యరాసులు । సంసారముక్షేత్రంబు
లుగృహములునతముగావు । నిష్ప్రయోజకంబగుసర్వము
మిథ్యనుమాయదిగాకను
... బ్రతుకుసర్వజీవరాసులకుభువి । ప్రాణముండబోదుశాశ్వ
తంబుగ సతముబాపిరాజదాసునేలిన । సర్వమయుడురా
ముడేస్థిరంబని ।సీ॥

కాంతా నీవిట్లువగచుచున్న భోజనము జేయు సర్వజనులు లేచి

పోదురు. గావున యీశవమునొకచోట నుంచుము. పిమ్మట యోచించవచ్చును.

కమ=నాథా మీచిత్తము. (భద్రపరచును)

బ్రాహ్మణులు=(భోజనముచేసి తేనుస్తూ) రామదాసుగారు ఏమిసంతర్పణజేసినారండి. బలే మీజన్మతరిస్తుంది. మీవంశము వృద్ధియవుతుంది. భోజనమేగాక దక్షిణలుకూడా యిప్పించినారు. సంతోషం యిక శెలవా.

రామ=మంచిదిమహాత్మా నమస్కారము.

బ్రాహ్మ=పుత్రపౌత్రాభివృద్ధిరస్తు శలవు.

రామ=ధన్యుడను మంచిది.

బ్రాహ్మ=శ్రీమద్రమారమణగోవిందోహరి. [నిష్క్రమించును]

రామ=[కుమారుని రామాలయములోనుంచి] శ్రీరామచంద్ర

27. హిందుస్తానీముఖారి—చతురశ్రగతి

ప॥ సమయమురావేరాశ్రీరామచంద్ర । సమయమురావేరా

అ॥ సమయముగావరాసర్వమునీవెర । కమలదళనయనగావగ నన్నిదె ।సమ॥

1. పాపమెరుగదుపశిసుకుమారుడు । నీపదములదరినెటుపడియుండెను

... కాపాడుముకన్నతండ్రిదీనద। యాపరుడవుభక్తకోటిలోయే యాపదలనుబెట్టనేరవటసుతు । నాదరించినసువులనొసగగ నిదె ।స॥

2. నీపాలనమునబాలకులెవ్వరు । నీల్గలేదటందురుపెద్దలుభువి

మాపరిభవివేయనిమదిగొలువను । మారునిరూపడగించితి వేమిర
... భూపాలకగోపాలకదీనద । భూపాలకనీపాలబడితిమో కా
పాడుమునీకన్న నుముఖ్యుల । గానరాము రామచంద్ర
రామా ।స॥
3. నీదుజన్మదినమనిసంతసమున । నెగడుచునుంటినిశ్రీరఘు
రామా నీదుపూజకొరకునుపవశించియు । నిర్మలిమైయుల
రా రెనాపత్ని
... మోదమలరపూలకొరకుబంపిన । ముద్దుబాలుడంతముం దె
నీయదిగా దె కారణంబురామచంద్ర । గావుమిపుడుశ్రీరమా
మనోహర ।స॥
4. క్షణములోనబ్రతుకకున్న నాదగుచావు। నిక్కువంబు నేడుతండ్రి
సుగుణుడునాతనూజుడు మీాపదము లె । గోరుచుండువాడు
సర్వవేళల
... ప్రాణుతింతుమనోవాక్సుద్ధిగనా । ప్రేమపుత్రునొసగునింత
కన్నను గణనగల్గుకార్యమేమిభక్తుల । గాచువేల్ప బాపిరాజ
పాలక ।స॥
ఓసీతామనోహరా కరుణాసాగరా.

సీ॥ జయరామ రఘురామ ! జానకీరామశ్రీ
కళ్యాణగుణధామ ! కరుణనామ
కోదండరామకా ! కోదరాంతకరామ
ఘోరాసురవిరామ ! కోరితినుమా

రారారమామనో ! హరా హరార్చితా
ధారావసుంధరా | ధారధీర
నీరజనయనావి ! నిర్మలాకార శృం
గారలంకారశ్రీ ! కారహృదయ
గీ॥ రార రక్షించరామర ! హరివిమల
తారహారాలధర నిర్వి ! కారనిష్క
ళంక లంకేశుహరిమే ! లౌరపుత్ర
నాసగు మోంకార శ్రీకార ! యురగశయన
రఘురాముడు=(లేచి) ఓజగత్సృష్టి స్థిత్యంతకారణా రామా

28. నాదనామక్రియ—చతురశ్రగతి

ప॥ శ్రీరామజగదభిరామా | జయరామభక్తజనకామా రా
రమ్యసుగుణవిచార । రక్షించుమారాకారారణరంగసూ
రశ్రీ।రా॥
2. మన్మానసాబ్జమదభృంగ । మరుమాటలేల శ్రీరంగా రా.
మానసుగావుపతంగ । కులరాజనీలరత్నాంగనుభాంగా
॥రా॥
3. మా. హితగుణసోభకరాజయి । మారుతివంగళధీర
మేల్ య. హితదుకృతవిచార । పర!మాగమనుతరమ్య
విహారాశ్రీ।రా॥
4. స్వా. మీశసర్వనివేశసోహం । సహస్రప్రకాశ
హ. మారనుగుణాకార । ఆద్యంతమధ్యవిచారవిహారా
॥రా॥

5. ఓంకారప్రణవాన్విహిత । యురగాదితల్పసమేత పంకేరు
హాక్షవిలాసహరి । బాపిరాజకవిపోషణాశ్రీ ।రా॥
రామ=(కుమారుని ముద్దుపెట్టుకొని) కుమారా శ్రీరామదత్తా
యత్తసుప్రాణ నేనెంతధన్యుడను.

29. ధన్యాసిరాగం—అడుగుకీర్తన—ఆదితాళం

ప॥ కలవుశ్రీరఘురామా జానకీరామ । కలవుపావననామరంగ
అ॥ కలవెనగుకారుణ్య । సాగారశ్రీకరా పలుమారునీనామ
భజనాచేసెదతండ్రి.
మి॥ కలతెరగునమదీయతనయుని । గాచితివినా పెన్నిధానమ
కలరెనీసరివేల్పులీయిల । కామజనకరమామనోహర
...యిలలోనమిముదలచుచు నిత్యమునీపూజల నాచరణశే
యుచు । యితరములౌపోకలనుబోవకయలరూచు । పాప
ములనుదొలగించుమనికోరుచు । శ్రీరామచంద్రా తలపూ
లలోననీదయ గోరియుండిన నిలచూనెమూపాద లెలమివు
సద్గుణమూర్తి ।క॥
2. కడుపేదనైపెక్కుగా దుఃఖమందేడు పడతీకినుతునిగనుప
రచి తమచరణముల
...కడ నిలచినాఝ్మమతి స్ఫూంగారముగ వెడలించి జగమున
నుడివెదను తమసదయ హృదయమునురగ శయనసార
సయనన మోహమున పుడమీజన్మమెత్తినా మానవూ
లాకు పుణ్యామొదవునెదలచిననూ తడబడకార్యమానయటు
ఓమ్నటలతనుజేయునది యుండున శ్రీరామ చంద్ర కడలేని

దుఃఖసాగర మీదుచునిన్ను నుదిపీన నవిమొల్ల నుదుగు బాపిరాడ్వరద । శ ॥

(యింటికి తీసుకువచ్చును)

కమ=నాయనా శ్రీరామచంద్రుడు మరల నిన్నొనగినాడ
(సుతుని గౌగలించుకొనును)

రామ=అవును

కమ=ధన్యులము

దేవే=మహాత్మా పిమ్మట యేమైనది.

నార=సురరాజ

30. శ్రీరాగము—చతురశ్రగతి

ప॥ ఎంతధన్యులో అంతమైన । సుతుడుబ్రతికె ।నెం॥

అ॥ చెంతజేరి రామ । చంద్రునిగొలచినకతమున ।నెం॥

మ॥ నుంతమైనవిన్న వారమే యీవింతజగమునంత వెదకిజూచిన బంతిలాగునాడుకొనెడి పుత్త్రుడుమరణించి మరలవచ్చెనాట ॥ఎం॥

2. తల్లిదండ్రిపోవుదారిమంచిదైన చల్లాగారక్షించి సాకుశా మచంద్రుడనుచు మన
... కెల్లరకునుబోధించి సద్గుణము తెలమి దెల్పి సంతసింపజేసెడు చల్లనైనవాడుగనుక రాముండుల్లమందునుండిగాచె నే॥ఎం

3. నాటనుండిచాలనమ్మి గుళ్లుగోపురములు హాటమైనరాతి తోటిగట్టించియును॥
... దీటుగాను ప్రాకారంబులుకడు దివ్యధ్వజస్తంభములు శిఖర

ములు నీటుపరచి యాభరణముల మితము సెలకొల్పెను సీతారాముల॥కెం॥

4. నిముషకాలమయిన నిల్వడూ శ్రీరామయనక॥ని॥
కమలా సద్వృత్తినే గడపూచుండ నిత్యాము
...అమితమైకోరుకోర్కెలెల్లను నానందముమీరగ నెరవే ర్పుచు క్రమతగృహాశ్రమధర్మములెల్లను గడపి బాపిరా ద్వరదునిదయ॥ఎం॥

దేవేంద్ర రామదాసుగారిట్లు ఆరులక్షల రూపాయలుఖర్చు పరచి సమస్తాభరణములు శ్రీరామమూర్తికి నిర్మించెను.

దేవే=మునిచంద్రా తమ యజమానులగు సర్కారువారికి పంపించలేదా.

నార=పంపించలేదు.

దేవే—వారూరకొనిరా.

నార=ఊరకొనరా మేనమామలెంతజెప్పిననూ వినక కింకరుల చేతికి జిక్కినాడు.

దేవే=శ్రీరామచంద్ర.

కింక=ఏమయాజల్ది.

31 చక్రవాకము—త్రిశ్రగతి.

ప॥ ఛీ ఛీ నీవెంతజేసినావు యింతి

అ॥ నీచముగావించితివి । దోసముయోచించి । తుదకు॥ ఛీఛీ॥

2. తాతగారిసొమ్మునుచును । ధారబోసినావ।యీ
చేతగానియుద్యోగము । చేయనేల నీచకుల॥ ఛీఛీ॥

3. ఎంతగట్టివాడవురా । గొంతుకుకోతకమారి
నుంతయైన యధికారిది । సామ్మునిరూచించవైతివి॥ చీఛీ॥
4. రారామూరాజువద్ద రాపిడిబెట్టెదము నిన్ను
కూర్రరామూతురక దెబ్బ । కొంచెము చవిజూతువులె॥చీఛీ॥
5. బాపిరాజవరదుడైన । పరమాత్ముడురాముడడ్డమేపగిదిని
వచ్చునో మే । మెరిగెదము దురంతకాడ॥ చీఛీ॥
(కట్టిలాగును)

రామ=తలోదరీ కలతనొందబోకుము నాకు కలవైనది.

32. సావేరిరాగము—చతురశ్రగతి.

ప॥ మరువబోకు మా శ్రీరాముని నీవు॥ మ॥
అ॥కరువుదీరనతడె । గాచువేల్పుమిమ్మెల్లర॥మ॥
కమ=నాథా అదేటిన్యాయము.
2. పోవ న్యాయమూమమ్ముల విడనాడి నాధ॥పో॥
నీవెగాక దిక్కెవరిక మమ్ములనేల । పట్టిబేల । నన్
విడచి॥పో॥
రామ=కాంతామణి.
3. ధైర్యము విడువకు తరుణీమణి నీ । కార్యమెడలకడు ।
కరినముదలచియు ధైర్య॥
రఘురా=నాన్నగారు మమ్ముల విడనాడు టన్యాయము
గాదుగదా మదిదలచిన॥నాన్న॥
రామ॥ముద్దులతనయా। మోహనరూప నీవద్దనుండ నోచనైతి
నేనో॥ ముద్దు॥

కమ=ఏగతిమిమ్ము్నలవిడనాడెదనో । యీగతిగలుగుటఎరుగక పోతిని ।ఏగ॥

రామ=ఎందుకింతబేలవో యెదవు ధీరా । సుందరాంగినుతుడు గలిగియుండగా । సందియ మేలను రాముని గొలచుచు । చక్కగ కాలము బుచ్చుతలోదరి ।ఎందు॥

కమ=ఎట్లైననూ మేము జీవించుట కష్టము నాథా

33. భూపాలరాగము—ఆదితాళం

ప॥ ఏమి శేతుమో మిమ్మూ్నలవిడనాడినాథ ।ఏమి॥

అ॥ రామచంద్రుడింతపంతమూని ని । రాకరించికష్టముల బెట్ట ।నేమి॥

2. ఫరాకుననునాన్నగారుపరని పలుకవే మనందు ముద్దునత । యుడునిరంతరము నీపదములగొలిచెడు నేనుఎటులజీవింతు భువిని। ఏ॥

3. నిలువలేనుకంపమొందె దేహము నీదుకఠినబంధనములుకను గొని । నిలచి తెల్లబోయిఏడ్చుకొమరుని నేనదెట్లుమందలిం చుదానవో । కలసినేనువత్తుజయిలులోనికి కరుణబూని దోట్కొనిబోవుడు ।ఏ॥

4 ధరనుబ్రాపిరాజదాసు నేలిన దశరథాత్మజుండుయిటుల మి మ్ము్నలఎరుగనట్లు జూచియూరకుంటుట ఎంతోవింతదోచె చింతగా ।ఏ॥

నాథా మీవెంట నేనుగూడ వచ్చెదను.

కింక=పోవమ్మ నీవురాతగవు

రఘురాముడు=నాన్నగారు రామునిగొలచుచుండుమూ
రామ=తల్లికిధైర్యముబోధించుచూ రామునిమాత్రము మరు
    వకుడు అదియేనాపునఃప్రవేశమునకు కారణము
కింక=జల్దీజావు [యీడ్చుకొనిపోవును]
తానీషా=యింతబడాచోర్

34. వసంతరాగము—త్రిశ్రగతి

ప॥ ఎంతపనిచేసినావురా । ఓకూర్రమతి ।ఎంత॥

అ॥ సంతసమునవమ్మినిన్ను । సర్వమునకధికారమీయసుంతనైన
    వయోచించక । సున్నజుట్టినావుడబ్బు ।ఎంత॥

2. యింతవాడవనుచునిన్ను । ఎరిగియున్ననాడెనాదు చెంతకు
    రానిచ్చెదనా । చెప్పునగొట్టించనా ।ఎంత॥

3. మించినదేమిరనిన్ను । వచ్చించకలేకయున్న చించ్చించుచు
    నాడియూరము । చీఛీయనుపలుతెరగుల ।ఎంత॥

4. కారాగారమునందున కఠినశిక్షులోనుండుము । చీరించెద
    వారమునకు । చేర్చుకుంటివాధనమును ।ఎంత॥

5. తురకబిడ్డననుచునీవు । ఎరుగలేకయిట్లైతివి నరికించెదపొడి
    పించెద । నాలుకచీలించెదర ।ఎంత॥

6. ధరనుబాపిరాజు వరదుడరయనడ్డపడునేమొ । త్వరితముగా
    జెయిలులోకి । దోసితాళమునుబిగింపుడి ।ఎంత॥

జల్ధీ షాజీ జల్దీ
షాజీ=సర్కార్ తమశలవు (గెంటుచూ) పదవయ్యా

తానీ=షాజీ శేరుప్పున్ను తవ్వేడుబియ్యముగాకలిపి నున యారు
లక్షలపైకము యిచ్చుపర్యంతము వంటిపూటపంపిపెట్టుము.
షాజీ=చిత్తము
రామ=రామపరమాత్మ

35. భూపాలరాగం—త్రిశ్రగతి

ప॥ తారకభక్తియూరామ ।తార॥
అ॥ సారసదళనయనసురసన్నుతభక్తవిచారణ ।తార॥
2. సాగరశయనుడవై యీసారములన్నియుగ్రహించి ।మాగ
వానితెరగునసీమోముజూపవేమనందు ।తార॥
3. ఏవిధమునజీవించుట యీలవణపదార్థముదిని ! గావకున్న
ప్రాణంబులు కడముట్టుటనిజము రామ ! భూవరుశాశనమి
ట్టుల శావకులునిరోధింతురు । సావధానముగనన్నిటుసాకు
ము తినలేనినాకు ।తార॥
4. బందిగమనుచింత స్వల్పభాగమైన లేదునాకు
బంధనమనెడు విచారపు పలుకైనను నుడువను' యి
బందిగలుగు లవణభుక్తి పాలబడియు స్రుక్క లేను
సుందర సుకుమార రామ సూర్యవంశ నిధసోమ॥ తార॥
5. కరుణతోడ స్వప్నమందు గానబడియు దయజూచిన
స్థిరమతి మృతినొందినట్టి చిన్నసుతుని గాచిన యా
పరమ పావన తరత్నువు బాకిరాజ కవినేలిన
పరమాత్మక యీ బాధల బారదోలుమా రజనకా॥ తార॥
(అన్నము చూచి.)

ఆహారమగుక్షీరాన్నము నూపాన్నముగా మారినదే సంతో
షముతో భుజించును.

షాజీ=దాసూ యిటురా అరుగోసర్కారు

రామ=(చూచి) రామా ! కాదు కాదు రాజా.

తానీషా—ఏమిరా సొమ్మంత తెచ్చినావా!

రామ=రాజా లేదు.

తానీషా=(కోపముతో) కింకరులారా యీతని కడుకష్టముల
పాలుచేసి వారమురోజులలో సొమ్మురప్పింపుడు. అప్పటి
కీయకున్న చిత్రవధ జేయుడు.

కింకరుడు=చి_త్తము దాను.

36. బేహాగ్ రాగము—ఆదితాళము.

ప॥ జా_స్తీగ యోచించుమా దుర్మతి నీమది॥ జా_స్తీ॥

అ॥ యిస్తావ యీయావా చి_త్తమొచ్చినరీతి
మొ_త్తీ చంపుదుమోరీ మూర్ఖాఖలుడ నిన్ను॥ జా_స్తీ॥

2. బాధాలు పడలేవు పైకమొసగుమునీవు
శోధించుచున్నాము పుణ్యాడవగుటచే॥ జా_స్తీ॥

3. ధరనూ బాపిరాజ వరదుండడ్డమైన
తిరిగిపోనిస్తామె దిక్కెవ్వరో నీకు॥ జా_స్తీ॥

భద్రముగా యోచించుకొనుము.

రామ=శ్రీరామచంద్ర దయాసాంద్ర కరిని రక్షించిన హరివి
గావా కరుణాకటాక్షబిరుదంబును వర్జించితివా కానలసం
చారముచే బుద్ధిమాంద్యమైనదా ఆ_ర్తత్రాణపరాయణ

నన్నుమరచిపోతివా రామా నాబంధనములుచూచి నప్పుడు నీనాగుపాశ బద్ధత్వమేల జ్ఞప్తికిరాదు. నాసతీ వియోగముగని నీ యువతీపరాయణత్వమేల స్ఫురణకు దెచ్చుకొన నేరవైతివి తండ్రి. యీకింకరులొనరించు కఠినమగు బాధలన్నియు గని అసురపీడనమేల మదికి దోచదు రామ రామ.

87. భూపాల రాగం ఆదితాళం.

ప॥ కింకరూల బాధ కింక నోర్వలేను తండ్రి

అ॥ జంకుదోచుచుండె నిన్ను గొలువగ శక్తిచాలదేమో
యని మది॥ కింకరుల॥

2. ఘోరమగు కృపాణి కోటితళ్కులకు నీరమట్లుగుండె నీల్గు
చుండె తండ్రి నా

మి॥ భారమంత నీయదియే యెంతటిపాపపుకాలము నరుదెంచె
గాని! క్రూరమ్లేచ్ఛ వాతనన్ను ద్రోచిన ఘోరమైన
వహ్నిలోనవైచిన
పేరునీదె నుమ్మా గాచెదు
దారినెంచు కొనుమ భక్తుల
భారము నీదనుమా వేరగు
తీరు దలంచకుమ రామ॥

...కారణంబులేక నిన్ను వేడను కామితంబులేక నిన్ను విడువను
నీరసించె నాదుమనము రండి నిజముయింక బ్రతుకలే
నండి॥కింక॥

3. ధరను బాపిరాజ నేలిన ధర్మకీర్తి రామచంద్రమూర్తి
కరుణ భావమొసగు కింకిరులకో కన్నతండ్రి నీకన్న
యెవరు॥కింక॥

కింకరన రే! దాసు ఎనిమిదిరోజులు వాయిదాయిచ్చినాడు ఆ లోన సామ్మియ్యకున్న నిన్ను వదనిచ్చుట కల్ల ఆలోచించుకొనుము.

(పోవును).

38. ముఖారిరాగము—చతురశ్రజాతి.

ప॥ బాధలనుభవించలేను తండ్రి పాలించగ వేగనన్ను రండి

అ॥ సాధువులకు కల్పతరువనుచు మన సారగోరువారల
కాపుడవట।

మిశ్ర॥ అంధకారబంధురమగు నీజయులందు బారనైచి
ఏమియెరుగని
చందముననునూరకుంటివా నాసాహసమును గనగనుం
టివా యిా॥బాధ॥

2. జన్మమాదినిన్ను మరచిఎరుగను క్షణకాలమునీ నామము
మరువను
మన్మానసము నెరుంగనివిధమున నూాయజేయుచుంటివే
మనందును
...సన్మానించి కృతార్థునిజేయుము సారసాక్షకరినేలువిధంబున
నున్మనోభీష్ట కల్పభూరుహామ మామనోహర బాపిరాడ్వ
రద॥బాధ॥

కం. పెక్కు గతుల వేడినను
నొక్కంటను జూడవేమయో ! నీమూలం
బిక్కరణిబాధబొందగ
నక్కట నాకయ్యె రామ ! యతులితనామా.

39. ధన్యాశిరాగము—చతురశ్రగతి,

ప॥ నమ్మియుంటి శ్రీరామ నన్నాదరించు రఘుకులాబ్ధి సోమా
అ॥ బొమ్మలాట తెరగున గల యీ దేహమ్ము లేల సొమ్ము
లిమ్ము వేల॥న॥

1. యిమ్ము ! నినుకలచితి మోక్షము తెమ్ము భక్తులగాచెడు
బిరుదమ్ము । వమ్ముజేయతగదనుకొమ్ము నాదుష్కృత
ములు వెడలిమ్ము । గావకుంటివా దోషమ్ము బొందెదవు
నామాట నమ్ముమింక కమ్మవిల్తు జనకతిరమ్ము జేయ
కుంటివా నాదుమేనమ్మియైన నిన్ను గాంచకుందున తమ్మి
దళవిలోచనా సుభూషణ॥స॥

2. ఏనా । నీకన్నను నాకెవరూరా దిక్కని మొరలిడుచుం
టీరా । కర్మములను జోరనీవేర । పుణ్యముగల మేలా
నురా । సర్వమయుడవని నమ్మితిరా । పాపాటవిధ్వంచెడు
ధీరా । పరమాత్ముడవీవాదురా । యిక బాధలుబెట్టకు
... సారసాక్ష । మారజనక । సరసవి చార శూరక్రూరరాక్ష
సాటవిమారణంబు జేయుగతిని యఘముల । బారదోలు
బాపిరాజ వరదా॥న॥

సీ. కడుకష్టదశలోన ! కరిని రక్షించిన
కరుణారసంబుయే ! గంగగలసె
గురుపరాభవమున ! కుంతికోడలగాచు
దాతృత్వమేయగ్ని ! దగ్ధమయ్యె
ప్రాణావశిష్టులౌ ! పాండుపుత్రులగాచు
సాత్త్వికగుణమెట్లు ! సమసిపోయె
నిర్హేతుకంబుగా ! నెలతనురక్షించు
విశ్వాసమెట్టుల ! దృశ్యమయ్యె
గీ. రామ రఘురామ రామ శ్రీ ! రామరామ
నీకు మ్రొక్కితి సర్వము ! లేకయుంటి
నప్పులకునింగినాడనీ ! కఖిలమైన
శాపతాపవృత్తితో రామ ! చంద్రమూర్తి.

40 హిందూస్తాని ముఖారి—అదితాళం.

ప॥ రామాననుబ్రోవవేమి రా । వెనుదీయక॥ శ్రా॥
అ॥ కష్టములకు పాలజేశి । గాంచవేమిరామరల॥రా॥
1. నినుదలచక నిద్రబోను । నీరములయినను గొనను
బనిగొనిపెరవారితోడ । బలుకనేరను యింత
కనికరముడుగుట యెందుకో । కారణంబునరయజాల॥రా॥
2 నీకొరకై పెక్కుధనము । నేవ్రయపరచితి నమ్ము
డుకొన న్యాయముగాదది । యుంచుకొనకు నారుణమ్ము
శ్రీకరుడవు భక్తవరుల । కేకష్టములనుబెట్టక
సాకెదువాడవటంచును । సర్వజనుల జెప్పుకొనును

నాకీచర దొలంగించుము । సన్నోక దారిని జేర్చుము
గాకున్నను ప్రాణంబులు । కడతేగట్టయది నిజమ్ము
రాకమానదు చాల్ । ఘరాకునొందరు పెద్ద
కూకలువేసెదను దుష్ట । కోటిలోన జేర్తువిన్ము॥ రా॥

3. వట్టిమాటలనుచు చెవిని । బెట్టబోకు సీతకునే
గట్టిగాజులును మురుగులు । కంకణాలు కడియాలు
పట్టుజకీ వలెవాటును । పటకావడ్డాణము రవ
గట్టిన డాలరు ముప్పిరి । కాసులపేరును తులసియు
చిట్టిముత్యముల వరుసలు । చిన్నమిరియముల పేరులు
నొట్టన పాపటబిందె । లొప్పగు కమ్మలు యుంగ్రాల్
బెట్టితి రామా సీతను । నిలచి చూడుమా నేవి
ముట్టకున్న నన్ను పాతి । పెట్టిన నప్పుట న్యాయము॥ రా॥

4. చాలును రామా నీకుంగ్రాలును । మురుగులు గొలుసులు
మేలిమి భుజకీర్తులు । రవమిళితమగు కిరీటము నీ
లాలు రవలు పచ్చలుగల । నీటగుకల్కితురాయియు
మేలగు భుజబందులు రవి । మించిన పతకములు పట్టు
శాలువాలు విలువైన । సరిగంచుదుకూలములును
చాలగ తమ్ములకు నీకు । చక్కగనిడి గుళ్లు గోపు
రాలు చాలగట్టించితి । రాజుజయులు పాలైతిని
మేలుగాదు యూరకుంట । మిక్కుటమగు బాధలుబడ
నాలసింపబోకు నన్ । న్నాదరించు నీకు కడు
మేలుగలుగు బాపిరాజ । నేలిన శ్రీరఘురామా॥ రా॥

41. పూరికళ్యాణి—చతురశ్రగతి.

ప॥ రామచంద్ర నీతరము గాకున్న । రాజ్యలక్ష్మి మాతల్లికి దెల్పుము

అ॥ కామితార్థములనెల్ల నొసగినఁ । గాపాడును నాజానకీమ తల్లి॥ రా॥

మ॥ ప్రేమమీరకారుణ్యాంబువులను । ప్రియమారగ గురియజేశి భక్తుల నామములను బోగ్రచునట్టి శ్రీకర । నీరజాక్షి కృష్టయురగ వేణితో॥ రా॥

2. మరచినాను దైత్యరాజు కోరినమాట । యెంత వెర్రివాడనైతిని చురుకుదనము జూపి నిన్ను బయటికి । జొనుపకున్న నీగతి యెట్లగునో

... పరమపావనిమతల్లి జానకీ । పల్లవాధరిసురూపరుచిరాంగి వెరచునా నీతెరంగున యాపద । వేడగా భక్తులను గాపాడక॥ రా॥

3. నిందజేశినానటంచు దలచక । నీరజాక్షి నిర్మలాంగ యాపదలందు మునుగ నోటికివచ్చినవిధ । మట్లు పేర్లుచున్న వాడరా నాయందు పుత్రవాత్సల్యముంచినఁ । న్నాదరించురామచంద్ర రామా బంధికానలో గలుగునాపదల। బాపు బాపిరాజపాలకా శ్రీ॥ రా॥

శ్రీరామా జానకీరామ । కళ్యాణగుణధామ కఠినాసుర గర్వవిదళనా । కరుణారసపరిపూర్ణ కమలదళనయనాదయ

రాదా । నేనాపదల జిక్కువడుట కల్లా।నీసర్వవిభవమును గాంచుకనుట'యీకష్టసాగరమున మునుగులాడు నన్నెట్లు జూచి యూరకుంటివి। రామా తల్లిజానకీ నీకైన నను కరుణ రాదా.

42. కాంభోజి— ఆదితాళము.

ప॥ శ్రీజానకీ నన్నుబ్రోవుమాని దెల్పు । శ్రీజానకీ

అ॥ భూజానివమ్మా । పుణ్యచారిత్రావు సుమ్మా॥శ్రీ॥

1. క్రూరాకార్యముల । నేర నెన్నడునన్

న్నీరీతి జేయుట నీతిగాదు తల్లీ నా

మి॥ భారమంత నీయదియేయని పరి । పరి విధముల వేడినా నటంచును చేరిపాదములనొత్తు వేళలన్ । చెలగి మాట లాడు కొనునపుడు॥శ్రీ॥

2. చక్కనైన మంచి వక్కలాకు లెంచి

మక్కువా జలంగమడచి నాధుని పంటి

నొక్కుల కందిచ్చెడు వేళలనీ । నుదుట తిలకమ్ముగ మద ము శ్వేదమున చెక్కులదిగజారగ జూచియు కడు । శ్రీ క్కినావటంచును మరగసి॥శ్రీ॥

3. కడగినీకు దయగలుగకున్న తనువు । కడతేరుట నిజముగా నెంచుమమ్మ నన్.

...నడియాసలు బెట్టకుడు గతించిన । యీపాపము మమ్ము లను జుట్టుకొని మడియుంచును బాపిరాజవరదుడు నాకు తోడుగలుగునట్లుగా॥శ్రీ॥

నార=అని రామదాసుగారనేసరికి సీత రామునిసన్నిధికరిగి

43. శంకరాభరణం—చతురశ్రగతి.

ప॥ ప్రాణనాథనన్ దయజూచి బ్రోవుము

అ॥ ప్రాణములబాయనెంచినాడు రామదాసు॥ ప్రా॥

1. చిన్ననాటినుండి నిన్నెనమ్మియుండె
కన్నడశేయుట గాదు మంచి నాథా
చిన్నబోయి ప్రాణావశిష్టుడై యున్నాడు
సన్నుతాంగ నతని సాకుము వేకునా

మ॥ పన్నరక్షకత్వపు బిరుదము ని। ష్పలితమయ్యె బ్రోవు
గాన వేగమె మన్న దిన్నవాని తెరగునుండక। మాట
దక్కించు ప్రాణముంచు॥ప్రా॥

2. అప్పచాలబడియె। నానందాము మనకుజేశి
చెప్పపీలులేని। చిక్కులుబడుచుండె
గొప్పగాదు యూర।కుండూట యోంచించిజూడ
యెప్పుడో రక్షించ। నెంచుట మేలౌనానీ

...యిప్పట్లను గాపాడుట విహితము। యిన కాంతార్థవ
సోమరామ యేతప్పులున్న మన్నించు। నాతోడు ధరను
బాపిరాజ వరద శ్రీ॥ప్రా

రాము=కాంతా యింక కొంతకాలమీతడు భక్తుడై యుండ
వలయును.

సీత=నాథా మనభక్తుడిప్పుడు బాధపడుచు ప్రాణత్యాగమునకు సంసిద్ధుడై యున్నాడు యిక జాగుజేయుట వీలుగాదు.

రాము=అట్లయిన నీ యిచ్చవచ్చిన తెరంగున జేశెదము లే లక్ష్మణా.

లక్ష్మ=అన్నగారి యాజ్ఞయేమి.

రాము=మనమిగుపురము బోయి రామదాసుని జూచి వత్తము

లక్ష్మ=తమచిత్తము (బయలుదేరిపోయి సొమ్ములక్కడుంచి) సర్కార్ మీపైకమిదుగో గొనుడు.

44. బారువా—చతురశ్రగతి.

ఖైలాగ్.

తానీషా=(చూచి)

ప॥ ఎవ్వరుమీరలు యిట కరుదెంచిరి ' ఎవ్వరుమీరు

అ॥ క్రొవ్విన విధమున । కేకలు వేయుచుంటి॥ రే॥

రాము=మేమూ.

... రామలక్ష్మణుల నామము గ్గిన

రాజకుమారుల । మోజనపాలా॥ రా॥

తానీ॥సరేగాని

... ఎందుట కిట మీరాక దెల్పుడీ

బందిగమందున బడ । వేయించెద॥ఎవ్వ॥

రాము=అలాగుననా

... బందిగమందున నుండువారలను

బాపగవచ్చిన సూరులమయ్యా॥ రా॥

తానీ=అబ్బా అట్లనా

... ఎవరితరవు మీరారాక వచ్చిరిపుడు

ప్రవిమలదేహులవలె దోచెడు మీ॥ఎవ॥

రాము=రాజా

... రామదాసు బంపవచ్చితిమి

మీమహిపన్నంతయు దెచ్చితిమి॥రా॥

తానీ=అట్లయిన సంతోషమేగాని

... లక్షలాపుగొని వచ్చినార ! యు

పేక్షకొంచెమే దెచ్చినారలా॥ల॥

రాము॥సొమ్మంతయు గొనివచ్చితిమయ్యా

యిమ్ము రసీదు మేమేగగవలయును॥రా॥

తానీ॥ఎంతటిధన్యుడు రామదాసునే॥ఎ॥

సంతోషము నేడు జమకట్టుట జూడ॥ఎం॥

రాము॥ధరను బాపిరాట్కవివరు నేలిన

పరమాత్ముని దయ వడశివ స్తిమయ్యా॥రా॥

తానీ=అయ్యా యిదుగో రశీదు

రాము=(పుచ్చుకొని) యికమాకుశలవు వెళ్ళను

తానీ=మంచిది (లేచిచూచి) అయ్యో యిదేమి యాశ్చర్యము

రామదాసుగారుధనమంపినారా స్వప్నమనుకొంటిని.

45. ఝంఝూటి—ఆదితాళము.

ప॥ ఎంతటి చిత్రమొ ! యెంతయానందమో

యిదియేమిటి యీ ! వింతగన ఆహా॥ఎం

అ॥ చెంతజేరినా । కింత ధనమొసగి
చెప్పి రసీదునుగొనిపోయిరి నే॥ డెం॥

2. మోసపోతినా కనులను దెరువక
మునిగినాడ దో । పతిమరమునబడి
దాశరథియెయిటు దర్శనమొసగియు
తగినవిధంబున జేశినాడు నే॥ డెం॥

3. చేజిక్కిన మాణిక్యము విడచిన
చెనటివిధంబున శ్రీరఘురాముని
అయయో నేడెడబాసితి నాకిక
యాధారము గానరాదు రామా॥ఎం॥

... యింతమహాత్ముడటంచును యెరుగక
యెన్నొచిక్కుల పాలుజేసితిని
నుంతయైన వెనుదీయక జయలున
నుగుణాత్ముని రామదాసునిడితిమి॥ఎం॥

5. ధరను శాపిరాడ్దాసుని బ్రోచిన
దాశరథియె దిక్కు
నాకువేరెయగు
తెరవుగానరాదు రామభక్తుని
స్థిరముజేయనట్టి వానికెన్నడు॥ఎం॥

లేచి రామదానుదగ్గరకు వెళ్ళి తాళముదీసి కాళ్ళమీాదబడి

46. కాంభోది—ఆదితాళం.

ప॥ క్షమియించు నాతప్పు తండ్రి నిన్ను
సిక్షించుఫలము నకెఱెఱచీనదండి॥క్ష॥

అ॥ భ్రమగొని చెడుద్రవ్యా పేక్షను మిమ్ముకడు
శ్రమబెట్టినాడను చెడుకాలమరగి నకె॥క్ష॥

2. కడుకష్టములబెట్టినాము దుండ
గము లెన్నో జేయించిమేము చాలా
యడియాసలోనరించి యానందమునుద్రుంచి
యిడుమాలలోముంచి యీరీతి చేడినాము॥క్ష॥

3. పాపుడనైతినీ దాపునజేరితి
కాపాడు నన్నింత కరుణించి రక్షించు
శ్రీపాతిపదభక్తవర్య దైవ చింతానమేనాకౌదార్య యింక
పాపాము జేయను బాపిరాట్పాలభక్తి॥క్ష॥

రామ=(లేవదీశి) నాయనా నాకర్మమిట్లుండ నీవేమి జేసితివి నన్నిన్ని కష్టములు రాముడే బెట్టినాడు కడకు రాముడే దయజూచినాడు నాయనా నీసొమ్మంతయు ముట్టినదా.

తానీ=స్వామీ సొమ్ముకేమి ముట్టినది నేను కడు పాపుడనైతిని నన్ను దరిజేర్చు భారమంతయు మీదియే.

రామ=అట్లయిన మనకిదియే శరణ్యము చెవియొగ్గుము

తానీ=(చెవియొగ్గును)

రామ=(తారకము జెప్పును)

తానీ=స్వామీ ధన్యుడనయితిని యిక భద్రాద్రితాలూకా రాముని మహోత్సవముక్రింద వినియోగించుము.

రామ=రాజా అట్లనే యిక నేబోయెదను

తానీ=స్వామి మరల తమదర్శనమెన్నటికో

రామ=రామునిదయ

తానీ=మంత్రులారా యీమహనీయుని పల్లకి యందిడుకొని భద్రాద్రిలో దించిరండు.

శేవ=స్వామి మంచిది తీసుకువెళ్ళెదరు

రామ=(రామునిదరిజేరి సాష్టాంగముగాబడి) స్వామీ రామచంద్రా.

47. బేహాగ్——ఆదితాళము.

ప॥ నేటికినాపై దయగల్గినదా । నీరజాక్ష నిరుపమసుగుణాకర॥ నే॥

అ॥ మాటికి నీపద సరసీరుహములె । నాటించితి నాహృత్కమలంబున॥ నే॥

1. సర్వమునిద్యనీ చరణయుగళమే శాశ్వతమని నేనమ్మితి తండ్రి యుర్విలోన నీకన్నను గతియొకటున్నద కడు యోచించినగాని॥ నే॥

2. దారాపుత్రులు తలిదండ్రులు ధనధాన్యాదులు దబ్బర లేనుమ కూరిమితో నీ నామముదలచిన జేరునె యఘములు శ్రీరఘురామా॥

8. ధరను బాపిరాట్కవివరు నేలిన పరమపావనుడ శ్రీరఘు రామా మరువకునన్నుపు డరమరనైనను కరిరాడ్వరదా కౌస్తుభమణిధర॥ నే॥

కబీ=రామదాసుగారు ఏమిచేయుచున్నారు.

రామ=[పాదములపైబడి] స్వామీ తమదాసుడనుగదా

రఘురాముడు=నాయన్నగారు నమస్కారము

కమ=నాథా రామునిదయ నేటికిగలిగినదా

రామ=సతీసుతులారా రామాజ్ఞకు మీరయున్నదా

కబీ=రామదాసుగారు మనరాకకు వాక్యములకు పురజనులు వేచియున్నారు ఒక్కసారి రామునిబాడుదము

రామ=స్వామీ తమయాజ్ఞానుసారముగా బాడుదము

48. ధన్యాసిరాగం — ఆదితాళము.

ప. తారకమేమన దారియనుచుమది। దలపోయుడు యో నరులార

అ. కారుబలశి యమభటులరు దెంచియు। కట్టితీసుకొని పో యెడువేళల

1. వాతపైత్య శ్లేష్మాదిమిళిత సన్ని। పాత దోషములపాలు బడియు కడుపాతకమగు నాశాపాశంబుల। పాలైముక్తికి చేడినవారలకు॥ తా॥

2. దైవచింతనము మించిన శేరొక। దారిలేదు సజ్జనులారా మాయప్రపంచము దారాపుత్రుల। మర్మమెరిగి వర్తించక చెడినను॥ తా॥

3. ధనధాన్యము లెన్నియున్న వెంటను । తరలి రావు మానవు లార ఘనముగ బాపిరాట్కవివరు నేలిన । కళ్యాణరామ చంద్రుడు గలిగిన॥తా॥

అందరూ సాష్టాంగముగా బడుదురు.

రాము=(అదృశ్యముగా ప్రత్యక్షమై) నాయ లార కొంత కాలమిట నన్నునమ్మి గొలచి వృద్ధిజేసినవిమ్మట కబీరు నకు, రామదాసుకు, కమలకు, రఘురామునకు, తానీ షాకు, పూలవిమానమంపుదును అటకురండు నాలో ఐక్యముగా వచ్చును. (అదృశ్యమగును)

వారందరు

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయక రఘునాయక శ్రీమద్రమారమణగోవిందోహరి.

నార=దేవేంద్రా అటుపిమ్మట కొన్నాళ్ళకు విమానము వచ్చినది ధన్యులైరి.

దేవే=స్వామి యెంతధన్యులైరి ఆహా వారిదే యదృష్టము మహాత్మునకు మంగళము బాడుదము.

అందరు చేతులతో హారతిబట్టి

49. జంజూటిరాగం—ఆదితాళం.

ప. జయ జేయహారతిగొను శ్రీరామా

అ. నయనగుణ శ్రీరఘునందన । సుందరా॥జ॥

1. పాపవిధారణ । భక్తసుపోషణ
నీపదకమలము । లే మదినమ్మితి॥జ॥

2. నిర్మల సుగుణా । నీరజనయనా
ధర్మపరిపాలన । తానవిభంజనా॥జ॥
3. గోపరిపాలన । కోదండవిదళన
పాపభయంకరా । పచ్చకర్పూరపు॥జ॥
4. ధరనుతరాతుడు । వరబాపిరాట్కవి
వరుని పాలించిన । వారిజనాభ॥జయజేయు॥
శ్రీమద్రఘురామణగోవిందోహరి.

భరతవాక్యం.

క. యీరామదాసచరితము
కారుణ్యముతోడ చదువ ! గల వారలకా
శ్రీరామమూర్తి ముక్తి య
పారంబుగ నిచ్చు సర్వ ! భాగ్యము లొసగుణ్.
మంగళం. మంగళం. మంగళం

యిట్లు,
శివంగి బాపిరాజు,
26—4—1927.

శ్రీచింతామణిముద్రాక్షరశాల, రాజమండ్రి.

# పీఠిక.

ఆర్యులారా!

ఈ కృష్ణలీల, భజనపూర్వకముగా యిదివరకు యెవ్వరు అచ్చొత్తించి యుండలేదు. గావున నాకు తెలిసినవిషయములతో ఈకృష్ణునియొక్క చరితము భజనకనుకూలించునట్లుగాను, తదుపరి బాలురకు బోధపడులాగునను, యింకా స్త్రీలు చదువుకొని ఆనందించునట్లుగాను, యీ పొత్తమును రచించితిని. యిందులో మరుగుపదములుగాని, తప్పుడుపదములుగాని వ్రాయలేదు. కృష్ణునియొక్క, గోపికలయొక్క, ఏశోదయొక్క చరితము వ్రాసితిని. యిదియంతయు కథాసందర్భముగాను కొంసునివధవరకు యీకృష్ణలీల వ్రాసితిని. గావున, యిందలి తప్పులున్న ఒప్పులుగా భావించి నన్ను ధన్యునిజేసి రక్షింపుడు.

ఇట్లు,

గ్రంథకర్త.



